# శ్రీపద్మావతీ
# శ్రీవేంకటేశ్వరక్షేత్రమాహాత్మ్యము

తిరుపతి, 1927

Record no. 809

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

శ్రీపద్మావతీ శ్రీవేంకటేశ్వరక్షేత్రమాహాత్మ్యము.- తిరుపతి : కే. సుందరాచార్లు బ్రదర్స్, 1927.

48 p. ;19 cm.

Record no. 809

Śrīpadmāvatī Śrīvēṅkaṭēśvarakṣētramāhātmyamu.- Tirupati : Kē. Sundarācārlu Bradars, 1927.

48 p. ;19 cm.

Record no. 809

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

716

శ్రీ తిరుమల తిరుపతి యాత్ర

శ్రీ

శ్రీనివాసాయనమః.

# శ్రీ పద్మావతీ శ్రీ వేంకటేశ్వర క్షేత్రమాహాత్మ్యము

ఇది,

శ్రీమత్ వరాహభవిష్యోత్తర పురాణాంతర్గతము.

తిరువానూరు పుస్తకవ్యాపారం.

కే. సుందరాచార్లు బ్రదర్సు వారిచే

ప్రచురింపఁబడినది.

628
13915



తిరుపతి

శ్రీవ్యాసముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడెను.

1927.

Registered Copy-Right.

వెల] [0—4—0.

శ్రీ

శ్రీ వేంకటేశాయనమః.

# శ్రీ వేంకటేశ్వర స్తోత్రము



శ్లోకములు.

సరోజపత్రలోచనం సుసాధులోకపావనం ।
చరాచరాత్మక ప్రపంచ సాక్షిభూతమవ్యయం ।
పురారిపద్మజామరేంద్ర పూజితాంఘ్రిపంకజం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

పురాణపూరుషం సమస్త పుణ్యకర్మరక్షణం ।
మురాసురాదిదానవేంద్ర మూర్ధదర్పభంజనమ్ ।
ధరాధరోద్ధరం ప్రశాంత తాపసాత్మవీక్షణం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

శరాసనాదిశస్త్రబృంద సాధనం శుభాకరం ।
ఖరాఖ్యరాక్షసేంద్రగర్వ కాననోగ్రపావకమ్ ।
నరాధినాథవందితం నగాత్మజాత్మసన్నుతమ్ ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరమ్ ॥

సురారిశౌర్యనిగ్రహం సుపర్వరాట్పరిగ్రహం ।
పరాత్పరం మునీంద్రచంద్ర భావగమ్యవిగ్రహమ్ ।
ధరామరాఘశోషణం సుధాతరంగభూషణం ।
స్మరామి వేంకటేశ్వరంచ సాగరాత్మజేశ్వరం ॥



# శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము

శ్లో॥ శ్రీమద్వేంకటనాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాన్తాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది ॥

సకల పురాణకథాశ్రవణ కుతూహలాయత చిత్తులగు శౌనకాది మునీంద్రులు పౌరాణికోత్తముండైన సూతమహాముని నవలోకించి ధాత్రిలోఁగల నూట యెనిమిది 1 తిరుపతులలో యెనిమిది 2 స్వయంవ్యక్తంబులుగల వందు శ్రీ వేంకటాచలమను శ్రీ వేంకటేశ్వర క్షేత్రము యెట్లు విశేషించినదై ఐహికాముష్మిక ఫల సకలసిద్ధిప్రదదంబైన స్థలం బైయ్యెనని ప్రశ్నఁజేయగా సూతమహాముని మందహాసముతో 3 శ్రీ వేంకటేశ్వరక్షేత్ర మాహాత్మ్యమును చెప్పుచున్నారు.

---

1. తిరు అనగా శ్రీపదము, పతి అనగా ప్రభువు. తిరుపతి యనగా లక్ష్మీప్రదుండైన శ్రీ వేంకటేశ్వరస్వామియనియు లేక శ్రీ వేంకటేశ్వరులు వేంచేసియున్న మహాక్షేత్రమనియుఁ బేరు.

2. శ్రీరంగము, శ్రీముష్ణము, తోతాద్రి, సాలగ్రామము, నైమిశము, బదరికాశ్రమము, కాంచీపురము వేంకటాచలమను శ్రీ వేంకటేశ్వర క్షేత్రము వీటికి అష్టస్వయంవ్యక్తంబులని పేరు.

8. శ్రీ వరాహ పద్మభవిష్యోత్తర పురాణాంతర్గతమైనది.

శ్రీమన్నారాయణుని నాభికమలమునందు చతుర్ముఖుండు జన్మించి శేషభూత ప్రపంచముల సృజనంబుఁ జేసెను. అప్పుడా భువనముల విష్ణుదేవుండు పాలనముచేయుచుండెను. ఇట్లు జరుగుచుండగ బ్రహ్మయొక్క 1 పగులు తీరగానే ప్రళయము సంప్రాప్తమయ్యెను అప్పుడు హిరణ్యాక్షుండు పృథ్విని రసాతలంబునకు దీసుకఁబోయి యందు సుఖముగా నుండెను. ఇట్లుండగా బ్రహ్మయొక్క నిద్రతీరి వచ్చు సమయములో శ్రీమహావిష్ణువు శ్వేతవరాహరూపమును ధరియించి మహాజలధిలోఁ జొరఁబడి హిరణ్యాక్షునిఁ జంపి మరల భూమినిఁ దెచ్చి కుదురుగానిల్పి, తదనంతరము గరుత్మంతునిఁబంపి శ్రీవైకుంఠములోని క్రీడాచలముఁ దెప్పించి లక్ష్మీభూనీళాసమేతుండై 2 శ్రీవేంకటాచలమునందు నివసించు చుండెను.

ఇట్లుండి కొంతకాలమునకు పిమ్మట లక్ష్మీవల్లభుఁడు శేషాద్రిలో శ్రీ శ్వేతవరాహస్వామినియుండ నియమించి తాను వైకుంఠములోనున్న నిత్యముక్తులఁ జూడబోయెను. త్రిలోకసంచారియైన నారదభగవానులాసంగతిని తన తండ్రియైన బ్రహ్మతో విన్నవించిరి,

అదివిని బ్రహ్మ, శ్రీనివాసమూర్తి భూమిలో లేకున్న మానవులు పాపసంభూతులై సత్కర్మలం జేయక నశించి

1. ఒక బ్రహ్మ పగులుకు 4000 యుగములు.

2. వేం అనగా పాపము, కట అనగా నాశనకరము. వేంకటాచలమనగా సకలపాప సంక్షయకరంబైన పుణ్యక్షేత్రమని యర్థము.



పోవుదురు. కాబట్టి సకల లోకోపకారార్థముగా భగవంతుని మరల వేంకటాచలమునకు రప్పించ నొక యుపాయముఁ జేయుమని నారదులకు సెలవిచ్చిరి. తదనంతరము విరించి శేషాచలంబున 1 శ్రీస్వామిపుష్కరిణి దక్షిణభాగమునందు దశరథ వను దేవుల తేజముతో నిర్మించఁబడిన తింత్రిణీవృక్షమునకు సమీపమునందు కౌసల్య దేవకీ కళలతో నొక వల్మీకముఁ దీర్చియుంచెను.

ఇట్లుండ నారదభగవానులు క్రమ్మర బయలుదేరి జాహ్నవీతీరమును జేరి యచ్చట క్రతువులఁజేయుచున్న కశ్యపాది మునీంద్రులవీక్షించి మీరు సల్పెడు యజ్ఞ ఫలభోక్తలైన దేవుఁడెవఁడని ప్రశ్నించ వారు సందియమునొంది యూరకుండిరి. అటుపై నారదులు ముమ్మూర్తులలో మోక్షప్రదుఁడైన దేవఁడెవఁడో విచారించి వానికి మీ యజ్ఞఫలంబుల సమర్పించి సంతసింపుఁడని జెప్పి పరమాత్మధ్యానుండై వెడలిపోయెను. తర్వాత కశ్యపాది మహర్షులు త్రిమూర్తులయందు ముక్తిప్రదుండైన మూర్తిని విచారించుకొనిరమ్మని భృగు మునీంద్రుని సంపగ నతండు సత్యకైలాస లోకంబుల

1 3 తింత్రిణీ వృక్షమనగా చింతమ్రాను. 3 3

* భృగు తొలుదొల్త సత్యలోకముచేరి తపోజన పరివృతుండై కొలువున్న బ్రహ్మసభలో ననుమతిలేక నాసనారూఢుండు కాఁగా బ్రహ్మ కోపముచే మాటలాడకుండెఁ గాన నతఁడు రజోగుణ స్వరూపుఁడనియు, తర్వాత కైలాసంబునకుఁ జని పార్వతీ సమేతుఁడై క్రీడించుచున్న శివుని యొద్దకుఁ

కేగి బ్రహ్మరుద్రులు * సత్వగుణప్రధానులు గారని యోజించి వెనుక వైకుంఠమునకుఁబోయి శేషతల్పంబునందు రమాసమేతుండై శయనించియున్న నారాయణుని వక్షమునందు నిజపదం బెత్తి తన్నెను.

అప్పుడు మహావిష్ణువు దిగ్గున లేచి యమ్మునీశ్వరుని || పాదమున కెంత నొప్పి కల్గెనోయని వానిని బహువిధముల నాదరింపగా భృగు శ్రీహరియొక్క సత్వగుణమునకుఁ గడు యచ్చెరువొందుచు త్రిమూర్తులందు శ్రీమహావిష్ణువే ‡ మోక్షప్రదుండని తీర్మానించి కశ్యపాదుల యొద్దకేగి జరిగిన వృత్తాంతముఁ జెప్ప వారందఱు యజ్ఞఫలంబును శ్రీమహావిష్ణువున కర్పితంబుసేసి శ్రీమన్నారాయణధ్యానపరాయణులై యుండిరి

---

* బోయి నిలువ పార్వతి లజ్జించుఁ జూచి శివుఁడు క్రోధోద్రేకి రక్తాంతుండై మాటలాడకుండె గాన శివుఁడుఁ తమోగుణస్వరూపుఁడనియు కాఁబట్టి రాజసతామస స్వరూపులు మోక్షప్రదులు గారనియు నిశ్చయించెను.

|| భృగు భగవంతుని వక్షంబునఁ దన్నినందువలన పాదమునందున్న నేత్రము గోలుపోయెను.

‡ భక్తజనులెంత పాపములఁ జేసినను మన్నించి రక్షించఁదగిన దేవుఁడే మోక్షప్రదుండౌను. పరిపూర్ణ సత్వగుణ స్వరూపుండు కానిచో మన్నించదగు కారుణ్యము, శాంతముండదు. శ్రీమహావిష్ణువు నిరతిశయ కృపానిధి గావున తన వక్షమందు తన్నినభృగు మహామునియొక్క క్రూర కార్యమును నేరముగా భావించక దయతో రక్షించెను. కాఁబట్టి యసమాన కారుణ్యముగల శ్రీమన్నారాయణుఁడె మోక్షప్రదుండు.



## శ్రీపద్మాదేవి హరిపై యలుగుట.

అట్లు భృగు హరివక్షమునఁ దన్నిపోగా తద్వక్షంబునందలరుచుండు లక్ష్మీదేవి దుష్టకార్యమును జేసిన భృగువర్యుని శిక్షింపక నాదరించినందుకు హరిపైఁ గోపించుకొని యిక వైకుంఠమునందుండ నొల్లననియు, నెచ్చటికైన నేగి శ్రీనివాసుని పాదపద్మముల ధ్యానించుచు నుండెదననియుఁ జెప్పెను. అంత కోపముచే గదరుచున్న లక్ష్మీదేవినిజూచి కమలాక్షుఁడు ఓయింతీ! భృగుమహాముని దన్నుటచే చాల శుభకరమయ్యెను. అందుకు కోపగింపకుమనెను. మఱల లక్ష్మీదేవి, పురుషోత్తమా! ఆత్మ[illegible] శాస్త్రజ్ఞవై, విశ్వేశ్వరుఁడవై యున్న నిన్ను పూజింపక మూర్ఖముగాఁ దన్నిన యా మునిని శిక్షించక సన్మానించితివి గదా యనెను శ్రీహరి యందుకు ఓ కమలనయనా! భృగు నీకు మనుమఁడు, బిడ్డ బిడ్డయిన వాఁడు, చిన్నవాఁడుగావున వానియందు కూర్మిఁదలఁపక గొట్టవగునే, జీవకోటులను కుక్షిని నుంచుకొనిన నేనిట్టి దోషంబుల సైరింపకున్న వేఱెవ్వరు సైరింతురనెను. అటుపై లక్ష్మీదేవి కేశవా! నేనెంతమాత్రమిక నీచోట నుండను. నేనాశ్రయించిన చోటఁదన్నిన మునిని మన్నించితివి వాఁడు నీశాంతమును జూచి నీవు భయపడితివని చులుకఁదనంబుగఁ బలుకఁడే! కావున చులుకదనంబుగఁ జూచి * గొల్లవాఁడెవఁడైనను నిన్ను గొట్టఁగలఁడు. ధరణీవాసులు నవ్వుదు

---

* చోళరాజుయొక్క పశులకాపరి భగవంతుని గొడ్డలితోఁ గొట్టెను.

నీపై * రాలు రువ్వగలవు. † మ్లేచ్ఛులు నిను వద్దసేయక నీగుణమాక్రమించఁగలరు, మఱియు నాకు నీవెడబాపు గల్పించిన బ్రాహ్మణ వంశజులు భిక్షుకులై తాము దారపుత్రాదులఁ బోషించుదురు, నిత్యకర్మలఁ గొన్నిటిని వదలి నీచులనాశ్రయించుదురు. పేదలై గ్రామంబునకు విద్యలమ్ముచు జీవించుదురని శాపంబిచ్చి క్రమ్మరవెడలి భూలోకమునందు శ్రీవేంకటాచలమునకుఁ బశ్చిమమునున్న * కొల్లాపురం చేరెను. మునులు తన్ను విడనాడిన కారణముఁబట్టి శ్రీనివాసుడు క్రమ్మర వైకుంఠమునువిడిచి శేషాద్రియందు బ్రహ్మచే నిర్మింపఁబడియున్న వల్మీకలక్ష్మి వచ్చి చేరెను. ఇంతలో కలియుగము పుట్టెను.

ఆ కాలమునందు భూమిలో చోళరాజు రాజ్యపాల

---

* ఆకాశరాజుసుతయైన పద్మావతి తన చెలికత్తెలచే హరిపై రాలు రువ్వించెను.

|| తురుష్క ప్రభువులు ద్రవ్యాపేక్షచే శ్రీవేంకటాచలము నాక్రమింప ప్రయత్నించిరి. మఱియు మతద్వేషముచేత క్షేత్రమును పాడుసేయ యత్నించిరి. ఢిల్లీ చక్రవర్తియయిన జహాంగీరునకు భగవంతుడు ప్రసన్నుండైన చరిత్రము శ్రీవేంకటేశ్వర భక్తవిజయములోని రెండవ భాగమున గానవచ్చును.

§ కొల్లయనగా విశేషము. నడుమ బయలును, పలు ప్రక్కలఁ గట్టడములును గల యింటికి కొల్లారు లేక కొల్లారమని పేరు. కుమారు యున్నూరు మైళ్ళదూరములో కొల్లాపురి యున్నది. నేటికిని యచ్చట శ్రీమహాలక్ష్మి యాలయము ప్రశస్తముగా నున్నది.



నము చేయుచుండెను. బ్రహ్మరుద్రులు వల్మీకములోనున్న నారాయణుని తృప్తిపరచనెంచినవారై గోధేనువుల రూపముల ధరించి. అప్పుడు కొల్లాపురమందుండిన లక్ష్మీదేవి గొల్లచాన వేషము ధరియించుకొనివచ్చి ఆగోధేనువుల చోళరాజు భార్యకు విక్రయించి చనెను. చోళరాజుభార్య వాటిని తన పశులకాపరి కొప్పగించెను. ఆగోవు ప్రతిదినమును యితర 1 పశువులతోఁగూడి శేషాద్రినెక్కిచని పుట్టలోనున్న విష్ణుమూర్తికి క్షీరమొసంగుచుండును, గోవుకు పాలు లేమిచే చోళరాజుభార్య పశులకాపరిని కోపించుకొనగా వాఁడొకదినమున పుట్టలో క్షీరమును కురిపించుచున్న గోవునుచూచి కినిసినవాఁడై తనచేతనున్న గొడ్డలితో ఆగోవు నడినెత్తినిం గొట్టఁబూనెను. అప్పుడు విష్ణు నడ్డంబువచ్చుటచేత ఆదెబ్బ వారి శిరంబునంబడి 2 రక్తప్రవాహమయ్యెను. అదిచూచి పశులకాపరి భ్రమించి మృతుఁడయ్యెను. ఆసంగతి చోళరాజు తెలుసుకొని విచారించుటకై పుట్టవద్దకురాగా నారాయణుఁడు రౌద్రాకారముతో వానికి పిశాచమైపోవునట్లు శాపంబిచ్చెను. అందుపై రాజు దీనుఁడై తన్ను క్షమించవలయునని బ్రతిమాలగా హరి తాను ఆకాశరాజు కన్యను వివాహమాడునప్పుడు రత్నఖచితమైన 3 కిరీట

---

1. చోళరాజునున్న పశువులసంఖ్య 2,000.
2. ఆ రక్తప్రవాహము సప్తతాళవృక్షప్రమాణము పూర్ణముగా పొంగుచు ప్రవహించెను.
3. 100 బారువుల కనకముతోఁ దీర్చి జీవమణులచే పొదిగించిన కిరీటము

ముసుచేసి తనకు సమర్పించినట్లయిన దానిని శుక్రవారములయందు ధరియింతుననియు, అట్టికాలములో మాత్రము వానికి పిశాచరూపము లేక పోవుననియు కొంతవరకు శాపమును మరలించెను.

పిమ్మట విష్ణుమూర్తికి గలిగిన నడినెత్తిగాయమునకు బృహస్పతి 1 మందు చెప్పిపోయెను. ఒకదినము హరి నరవేషంబున తన ఔషధముం దానే తెచ్చుటకు పోవుచుండగా వరాహమూర్తి వృషభాసురుని వధించివచ్చుచు నరవేషుండై దృగ్గోచరంబైన హరినిం జూచి యతఁడొక రాక్షసమాయాకారుండని యెంచి యుద్ధసన్నద్ధుండాయెను. అంత హరి వరాహస్వామికి నమ్రుండై తన నిజస్థితి నెఱింగించెను. అందుపై వరాహమూర్తి కృపఁగలవారై నూఱడుగుల భూమినిం గోరిచి శ్రీనివాసునికిచ్చి అందులకైన క్రయమును యిమ్మని యడిగెను. అప్పుడు పురుషోత్తముఁడు, లక్ష్మీదేవి యెడబాపుచేత తనవద్ద ద్రవ్యము లేనివారైనందున ప్రజలను కొండకు రప్పించి మున్ముగా వారిని శ్రీవరాహస్వామికై వేద్యారాధనలం జేయునట్లును, ముందు వారిని దర్శించి పిమ్మట తన్ను దర్శించునట్లును, ప్రజలవద్ద యాచించి అందులకైన క్రయమును చెల్లించునట్లును 2 ఏర్పాటుచేసెను.

---

1. జిల్లేడు పత్తిని పాలులోఁ దడిపి గాయమునకు కట్టుట.

2. ఈ కారణముఁబట్టియే ప్రజలు యిప్పటికిన్ని ముందు శ్రీవరాహ స్వామిని దర్శించి ముందు పూజాదులను వారికి జరిపించి పిమ్మట శ్రీనివాస



శ్రీవరాహమూర్తి ఆనిబంధనల కియ్యకొనినవారై తన వంటకత్తెగానుండిన (1)వకుళమాలికాదేవిని శ్రీవిష్ణువునకు సేవలొనరింప నియమించెను

ఆ కాలమునందు శ్రీ వేంకటాచలమున కాగ్నేయ భాగమందున్న నారాయణపురంబున ఆకాశరాజు రాజ్యము చేయుచుండెను. అతఁడు సంతానప్రాప్తికిగాను పుత్రకామేష్టి యాగముజేయ నెత్నించినవాఁడై యాగకుండమునకై భూమిని బంగారు నాగలితో దున్నించెను. అప్పుడు సహస్ర దళ స్వర్ణకమలమొకటియు, అందులో నొక (2) కన్యకారత్నమును కానంబడెను. ఆశిశువును అతఁడత్యంత గారాబముతో పెంచుచు (3) పద్మావతియని నామకరణముఁ జేసెను. ఇట్లుండగా

---

మూర్తిని సేవించు చున్నారు.

1. శ్రీ యశోదాదేవి చిన్నికృష్ణునియందు పుత్రవాత్సల్యతఁ గలదై కాలదశనొందగా, తద్ఋణానుబంధమును భావించి బ్రహ్మ ఆమెను వకుళ మాలికగా సృజనంబుఁ జేసి శ్రీవరాహస్వామి చెంత నిలిపెను.

2. ఆకాశరాజునకు తదనంతరము, వసుధానుండనిన్ని, తొండమానుండనిన్ని యిద్దరు సుపుత్రులు జన్మించిరి.

3. పద్మావతీ యనగా పద్మమునందలి శ్రీయని యర్థము. కృత యుగమున రావణాసురుడు సీతాదేవినిం దీసుకొని పోవుచుండగా నగ్నిహోత్రుఁడు వేదవతిని సీతారూపముగాఁ జేసి రావణాసురునికి మాయసీతయే నిజమైన సీతయని చెప్పి వేదవతిని వానివద్దనునిచి సీతాదేవిని తనయందే దాచియుంచెను. తదనంతరము శ్రీరామభద్రుని పట్టాభిషేకసమయమున జానకీదేవి అగ్నిలో ప్రవేశమైనప్పుడు అందే రెండు సీతలు కానంబడుటచేత

పద్మావతి యుక్తవయస్సుఁగలదై యొకనాడు ఉద్యానవనంబున చెలికత్తెలతో విహరించుచుండెను. అప్పుడు నారద భగవానులచ్చటికివచ్చి పద్మావతికి హస్త సాముద్రికముఁ జూచి ఆమెను శ్రీమన్నారాయణుఁడే పాణిగ్రహణముచేయును అని వాక్రుచ్చిపోయెను. ఇంతలో వల్మీకములోనున్న శ్రీనివాసుఁడు వేటలాడ నుద్దేశించినవారై, బోయవేషమును ధరియించుకొని యొక శ్వేతాశ్వమునెక్కి పయనంబై వచ్చిరి. అప్పుడొక గజము కానంబడుటచేత శ్రీనివాసుఁడు దానిఁదఱుముకొని బహుదూరముపోయి పద్మావతి విహరించుచున్న వనంబువద్దకు వచ్చిచేరెను. అప్పుడు గజరాజము శ్రీనివాసునకు ప్రణమిల్లి తన్ను రక్షించుమని వేడెను. పరంధాముఁడు కరుణచే దానిని యాదరించి తదనంతరము పద్మావతి విహరించుచున్న వుద్యానవనములోనికి ప్రవేశించి పద్మావతిఁ జూచి వ్యామోహితుండై ఆమెను తన్ను వివాహముఁ జేసుకొమ్మని యడిగెను. అందుకు పద్మావతి కోపించుకొన్నదయి తన చెలికత్తెలచే హరిపై ఱాళ్లను ఱువ్వించెను.

---

జానకీదేవిని ఆ రహస్యమేమని రాముఁడడుగగా, సీతాదేవి జరిగిన నిజవృత్తాంతముల నెఱింగించి తననిమిత్తమై లంకలో అనంతకష్టముల ననుభవించిన వేదవతిని పాణిగ్రహణము చేయుమని ప్రార్థించెను. అందుకు శ్రీరాములు తాను ఏకపత్నీవ్రతుఁడనిన్ని, కలియుగములో వేంకటాచలమున నవతరించునప్పుడు వేదవతిని పాణిగ్రహణము చేసుకొనియెదననిన్ని చెప్పెను. కాబట్టి వేదవతి కలియుగములో పద్మావతియై యవతరించెను.



అప్పుడు హరి ఆ దెబ్బలకోర్వలేక వెళ్లినవారై తననివాసముఁ జేరిరి. శ్రీనివాసునికిఁ గలిగిన తాపమునకేమి కారణమో యని విచారించి తెలుసుకొన్నదయి వకుళమాలికాదేవి యెట్లయినను పద్మావతిని పరిణయంబుచేసి పెట్టెదనని శపథంబుచేసి హరిని యూరడించి అందునిమిత్తమై నారాయణపురమునకు పయనమై పోయెను.

ఇంతలో విష్ణుమూర్తి యెఱుకలసాని వేషముఁ బూనినవారై ఆకాశరాజు పట్నమునకుఁబోయి సోదెచెప్పెదనని వీధులలో కూయుచుంబోయెను. పద్మావతి ఉద్యానవనంబున హరినిఁ జూచిన దినము మొదలు మోహపరితాపమును పొందియుండుటచేత, తల్లియైన ధరణీదేవి ఆ యెఱుకలసానిని తనవద్దకు రప్పించి సోదెచెప్పుమని యడిగెను. అందు కామాయావతి, విష్ణుమూర్తికి పద్మావతి నిచ్చి వివాహము చేసిన కడు శుభమనిన్ని, అందునిమిత్తమై యచ్చటికి శీఘ్రములో నొక భామామణి రాఁబోవుచున్నదనిన్ని చెప్పి ఆ స్థలమును విడిచి మరల స్వస్వరూపముతో యథాస్థానమునకుఁ బోయిచేరెను. పిమ్మట వకుళమాలిక నారాయణపురము చేరి, పద్మావతి తాపజ్వర నివారణార్థము ఆకాశరాజు రుద్రాభిషేకముఁ జేయుచుండఁగా నప్పుడు రుద్రుని దేవాలయమువద్ద చేరియున్న సుమంగలి స్త్రీలంగూడి ధరణీదేవి యొద్దకుఁజని వివాహప్రస్తావముఁ జేసెను. ఆ శుభవార్తను ధరణీదేవి ఆకాశరాజుతో విన్నవించగా నామహీపతి సంత

సించి, శుకయోగీంద్రుని పిలిపించి వారియొద్ద శ్రీనివాస మూర్తికి శుభలేఖనువ్రాసి పంపించెను. గోవిందుఁడా శుభలేఖనందుకొని రేపు వైశాఖ శుద్ధదశమి రాత్రి సుముహూర్తమునకు సకల పరివారములతో మేము వచ్చెదమని ప్రత్యుత్తరము వ్రాసిపంపెను.

పిమ్మట మాధవుండు వివాహఖర్చులకై ధనము కావలసియుండుటచేత శ్రీవరాహస్వామిని ఋణంబుగా ద్రవ్యమిమ్మని వేఁడెను. వారందుల కియ్యకొనకఁబోవుటచేత గరుడభుజగేంద్రులద్వారా బ్రహ్మరుద్రులకు వర్తమానము బంపగా వారు అష్టదిక్పాలకుల సమేతముగా విచ్చేసిరి. తదనంతరము శ్రీనివాసమూర్తి బ్రహ్మరుద్రులను 1 అశ్వత్థ వృక్షములను సాక్షులుగాఁబెట్టి కుబేరునివద్ద కోటి పదునాల్గు లక్షల 1,1400,000 రామటెంకి నిష్కములు నప్పుగాఁదీసి, అందుకు సంవత్సరమునకు 1000 రామటెంకీలను వడ్డీగా నిచ్చునట్లును కలియుగాంతమున అప్పునుచెల్లించునట్లును 2 అప్పు పత్రము వ్రాసియిచ్చెను.

1. శ్రీస్వామిపుష్కరిణి పడమరతటంబునందు ఆరెండు అశ్వత్థవృక్షములు నేటికిని కానంబడుచున్నవి. అశ్వత్థవృక్షమనగా రావిచెట్టు.

2. ఈ అప్పు చెల్లించు నిమిత్తమై శ్రీనివాసమూర్తి భక్తజనులవద్ద ప్రార్థనమూలముగా కానుకలును గడువు తప్పినప్పుడు అంగలకైన వడ్డియును తీయుదురు. కాఁబట్టి శ్రీవేంకటేశ్వరులకు వడ్డికాసుల వేంకటేశ్వరలను పేరు ప్రసిద్ధిగాగలిగినది.



పిమ్మట సూర్యుఁడు కొల్లాపురమునకుఁజని లక్ష్మీదేవిని దోడ్కొనివచ్చెను ముప్పది ముక్కోటిదేవతలు,నక్షత్రములు గంధర్వ యిందాది దిక్పాలప్రముఖులును వచ్చిచేరిరి. శ్రీనివాసుడు సకలపరివారములతోఁగూడి నారాయణపురంబునకుఁబోగా నాకాశరాజు వారల నెదుర్కొనివచ్చి తగు మర్యాదలతోఁ దోడ్కొనిపోయి లక్ష్మీశ్రీనివాసులను విడది గృహంబున ప్రవేశింపఁజేసి శుభముహూర్తమున పద్మావతిని హరికిచ్చి పాణిగ్రహణముఁజేసెను. తర్వాత శ్రీనివాసమూర్తి పద్మావతినిదోడ్కొని 1 అగస్త్యాశ్రమమునకుఁబోగా వారు వివాహము జరిగిన ఆరుమాసములు శైలారోహణముఁ జేయఁగూడదనిచెప్పి, వారిని ఆ కాలపర్యంతము తన యాశ్రమమందుంచుకొని సత్కరించిపంపెను. రమాదేవియు మరల కొల్లాపురంబునకుఁ బోయి చేరెను.

శ్రీనివాసమూర్తి పద్మావతితో కొంతకాలము శేషాద్రియందు నివసించియుండినవారై పిమ్మటరమాదేవిని వెదుకఁబోయెను. లక్ష్మీదేవి వారి రాకను తెలుసుకొని క్రిమ్మర కొల్లాపురము విడిచి పాతాళలోకమునందున్న కపిలాశ్రమమునఁజేరి డాగియుండెను. కొల్లాపురంబునకుఁ బోయి చూడగా లక్ష్మీదేవి కానంబడకపోవుటచేత హరి చింతాక్రాంతుండై పూర్వము అగస్త్యమహామునులు పూజించు

1. చంద్రగిరి సమీపమునందుండు అరణ్యప్రదేశమునకు అగస్త్యాశ్రమమని చెప్పంబడుచున్నది.

చుండిన లక్ష్మీవిగ్రహమును ఆరాధించుచుండెను. అప్పుడు ఆకాశవాణి హరినిజూచి మీరు శుకాశ్రమమునకుఁజని లక్ష్మీదేవినిగూర్చి తపమాచరించినయెడల మరల సుధాబ్ధికన్యఁ బొందుదురని చెప్పగా, విష్ణువా ప్రకారముగా జేయ నిశ్చయించినవారై శుకాశ్రమముఁ జేరి తన చక్రాయుధముచేత నొక పుష్కరిణినిఁగావించి, మందాకినిలోని సహస్రదళ పద్మముల వాయుదేవునిఁబంపి తీసుకరమ్మని ఆపద్మములనా పుష్కరిణిలో ప్రకాశింపఁజేసి, ఆతీర్థఘట్టమునందు కమలము వికసించియే యుండు నిమిత్తమై సూర్యుని ప్రతిష్ఠించి, యిరువదినాలుగు సంవత్సరములు తపమాచరించెను. అప్పుడు దేవేంద్రుడు యెవడో నరపతి తనపదమున కాశించి తపమాచరించుచున్నాడని యెంచి, ఆ తపోవిఘ్నమునకై రంభాదులం బంపెను. 1 వారు ఆమహాత్ముని చలింపఁజేయలేక అవమాన భీతులం బొందినవారై మరల సురలోకముఁజేరి సురపతి కా వర్తమానముఁ జెప్పిరి.

ఇట్లుండఁగా పాతాళలోకమున రమాదేవి కపిలమహామునినిఁజూచి తాను దాగియున్న వృత్తాంతముఁ జెప్పెను. అందుకు యోగీశ్వరుండు ఆజననిశ్రేయంబుగా హరియర్చించు కమలమునం దవతరించి శ్రీనివాసుని హృదయముఁ జేరవలయునని ప్రార్థించెను. అందుపై సిరి ఆ మునీశ్వరుని

1. అప్పుడా ఆదేవాంగనల నవమానపరచుటకై హరి, మోహినీదేవతను సృజించిరి.



ప్రార్థనల నంగీకరించి కార్తికమాస పూర్వపక్ష పంచమిఁ గూడిన శుక్రవారమునాడు దేదీప్యమానంబుగా నాపద్మమందు జనితంబై శ్రీనివాసుని హృదయములోఁ జేరెను. అప్పుడు బ్రహ్మరుద్రాది దేవతలు వారిరువురిపై పుష్పముల వర్షించిరి. రంభాది యప్సరసలు నాట్యములఁ జేసిరి. దేవదుందుభులు వాద్యముల మొరయించిరి.

పిమ్మట పరంధాముఁడు బ్రహ్మరుద్రాదులఁ దోడ్కొని వేంకటాచలమున కేగి శ్రీ పద్మావతీ లక్ష్మీ భూనీళా దేవులతో క్రీడించుచు కలియుగ ప్రత్యక్షదైవంబై దుష్టశిక్షణంబును శిష్ట పరిపాలనంబును చేయుచున్నారు.

* శ్రీ బ్రహ్మోత్సవము:—భాద్రపద మాసమున చిత్రాఖ్య నక్షత్రమందు సధ్వజారోహణమును, ఉత్తరాషాఢలో రథోత్సవంబును, శ్రవణనక్షత్రమందు తీర్థవారియును జరుగుచున్నవి.

శ్రీ వేంకటాద్రి నామములు:—ఈశైల రాజమునకు చింతామణి, జ్ఞానాద్రి, వరహాద్రి, తీర్థాచలము, పుష్కరగిరి, కనకాద్రి, నారాయణాద్రి, వైకుంఠాద్రి, నృసింహాద్రి, శ్రీనివాసగిరి, ఆనందాద్రి, గరుడాద్రియని అనేక పేరులుగలవు, మరియు నీపర్వతమునకు కృతయుగమునం దీస్థలమున హరి వృషభాసురుని సంహరించుటచేత వృషభాద్రియనియు,

* ప్రారంభమున బ్రహ్మదేవునిచే జరిపింపఁబడుటచేత దీనికి బ్రహ్మోత్సవమని పేరు.

త్రేతాయుగమున అంజనాదేవి హరిప్రసాదముచేత ఆంజనేయులఁ బడసినందువల్ల అంజనాద్రియనియు, ద్వాపరయుగమున ఆదిశేషునకును వాయుదేవునికిని బలాధిక్యమునకై, వివాదము కలుగగా నాదిశేషుఁడోడిపోయినవాఁడై యీపర్వతమునందు డాగుకొని యంతర్ధానముఁబొందుటచేత శేషాద్రియనియు, కలియుగములో ఆశ్రితులయొక్క సకలపాపముల సంక్షయించుటచేత వేంకటాచలమనియు సుప్రసిద్ధమైన నామములు గలవు.

తీర్థమాహాత్మ్యము:—పురాణప్రసిద్ధముగా నీ పర్వతమునందు మూడున్నరకోటి తీర్థములున్నవి. అందు నూటయెనిమిది తీర్థములే ముఖ్యమైనవి. వానిలోనున్న కడుపావనమైనవి సప్తదశతీర్థములై యున్నవి.

శ్రీస్వామిపుష్కరిణి:— ఇది శ్రీస్వామివారి ఆలయమునకు ఉత్తరఘట్టమునందున్నది ఇందులో కుబేర, గాలవ మార్కండేయ, యమ, వరుణ, అగ్ని, వాయు, వసిష్ఠ, సరస్వతీ తీర్థములు అంతర్భూతములై యున్నవి. గంగాభవానివలె నదీరూపమై పరిఢవించ నెంచి, సరస్వతీదేవి శ్రీ మహావిష్ణువుఁగూర్చి తపమాచరించి, తనపుత్రుఁడైన పులస్త్యబ్రహ్మ శాపవశముచేత నదీరూపముఁబొందక శ్రీ వేంకటాచలమున సరోవరరూపముఁబొంది శ్రీ స్వామి పుష్కరిణియనఁ బరగుచున్నది. ఇందులోఁ జేరినదై శ్రీవరాహతీర్థము, శ్రీవరాహస్వామి దేవాలయమునకు తూర్పునందున్నది.



ధనుర్మాస శుక్లపక్ష ద్వాదశినాఁడు శ్రీస్వామిపుష్కరిణీ స్నానము కడుశుభకరము. అపుణ్యదివసమునందు భరతఖండములోని సమస్తతీర్థములు శ్రీస్వామిపుష్కరిణిలో చేరుచున్నవి. ఆ కారణముఁబట్టి నాటిదిన మీతీర్థము పూరించుచున్నది.

పాపవినాశము:— ఇది స్వామివారి ఆలయమునకు ఉత్తర పడమరగా మూఁడుమైళ్ల దూరములోనున్నది. బ్రహ్మరాక్షసి పట్టినయొకఁడు విభ్రమఁజెంది అడవులయందు సంతత సంచరించుచు తుదకు అగస్త్యులవారి యనుగ్రహముబొంది శ్రీ వేంకటాచలమునకేఁగి యీతీర్థస్నానముచే పాపవిముక్తుండాయెను. ఆశ్వయుజ శుద్ధసప్తమినాఁడు ఈ తీర్థస్నానముచే సకలపాపహరమౌను.

ఆకాశగంగ:— ఇది స్వామివారి ఆలయమునకు ఉత్తరముగా రెండుమైళ్లదూరములో నున్నది తిరుమలనంబియను యొకభక్తునికొరకు శ్రీనివాసమూర్తిచే యీతీర్థము ఉత్పన్నము చేయఁబడినది. ఈతీర్థము శ్రీ వేంకటేశ్వరుల యారాధనకు ప్రతిరోజును తేఁబడుచున్నది. చైత్రశుద్ధపౌర్ణమినాఁడు యీతీర్థంబునందు స్నానమాచరించిన అనేక యజ్ఞక్రతువులఁ జేసిన ఫలంబు లభించును.

పాండవతీర్థము:— ఇది శ్రీవారి సన్నిధికి ఈశాన్యంబుగా నొకమైలు దూరంబులో నున్నది. పంచపాండవులు తమరాజ్యంబుల బోగొట్టుకొన్నవారై వేంకటాచలమునకు వచ్చి శ్రీనివాసమూర్తినిఁగూర్చి ఈ తీర్థఘట్టంబునందు

తపమాచరించి తత్ఫలంబుచేత శత్రువులంజయించి మరల రాజ్యభోగంబులం బొందిరి. నేటికిని ఆతీర్థఘట్టంబునందు పంచపాండవుల విగ్రహంబులు గలవు వైశాఖ బహుళ ద్వాదశిదినమందు ఈతీర్థస్నానంబుచే శత్రుజయంబును. పోగొట్టుకొన్న భాగ్యసిద్ధియు, గలుగును

గోగర్భము:—ఇది పాండవతీర్థంబునకు పడమరగా నతి సమీపంబులో నున్నది. ఇది పంచపాండవులలో నొకండైన భీమసేనుండు తనగదను వేసినస్థలంబు గోరూపంబుగా నిర్మింపబడియున్న బిలంబుగుండా తీర్థంబు ప్రవహించుటచేత ఈతీర్థంబునకు గోగర్భమని పేరు కలిగినది.

కుమారధార:—ఇది మున్ను పేర్కొనిన పాపవినాశ తీర్థంబునకు వాయువ్యమూలగా నైదుమైళ్ల దూరంబులో నున్నది. పూర్వంబు కుమారస్వామి తారకాసురుని సంహరించి అందువల్లంగలిగిన బ్రహ్మహత్యదోషంబు ఈతీర్థంబునందు స్నానంబాచరించుకొని శ్రీ వేంకటేశ్వరులంగూర్చి తపమొనరించి పోగొట్టుకొనిరి. కాబట్టి ఈ తీర్థంబునకు కుమారతారక తీర్థమనిన్ని పేరు. కౌండిణ్యుండను మరియు నొక వృద్ధబ్రాహ్మణుండు యాగందుచేయుటకై వచ్చి శ్రీనివాసుని యనుగ్రహంబుచేత ఈతీర్థమందుస్నానమాచరించి బాలకుమారునివలె యౌవ్వనపర్వముం గలవాండాయెను, మాఘశుద్ధ పౌర్ణమినాడు, ఈ తీర్థస్నానంబుచే యాగ ఫలంబును ముక్తియును సిద్ధించును.



సనకసనందన:—ఇది మున్ను పేర్కొనిన పాపవినాశ తీర్థంబునకు నొకమైలుదూరంబులో నుత్తరముగానున్నది. సనకసనందనాది మహాఋషులు దీనిలో స్నానమాచరించి శ్రీనివాసునిధ్యానించి యిష్టసిద్ధులం బొందిరి. మార్గశీర్ష శుద్ధ త్రయోదశి దినంబున ఈ తీర్థస్నానంబుచే సమస్త విఘ్నంబులు నాశనమొందును. దీనికి సమీపంబులో గోముఖతీర్థమున్నది.

రామకృష్ణ:—ఇది శ్రీవారి ఆలయంబునకు యెనిమిది మైళ్ళదూరంబులో పాపవినాశ తీర్థంబుయొక్క మార్గంబు గానే తూర్పుగా నున్నది. రామకృష్ణుండను యొక మౌని అనేక సంవత్సరంబులు యిచ్చట తపస్సుచేయుచుండగా వాని దేహంబుపై వల్మీకంబులు కలిగెను. దేవేంద్రుండప్పుడు వానిఘోరతపంబు తనపదవిబొందనేమో యని యెంచిభీతిల్లి తపోవిఘ్నంబునకై వానిపై సప్తదినంబులు ఘోరవర్షంబుల గురిపించెను. అందుపై వల్మీకంబులు శిథిలములయ్యెను. గాని మునిశ్రేష్ఠుండు చలించక తపమొనరించుచునేయుండెను. అంతట శ్రీ వేంకటేశ్వరులు యతనికి సుప్రసన్నుండై యిష్టసిద్ధులనిచ్చెను. ఇచ్చట రమణీయమైన పంచరంగులుచే నొప్పిదంబయిన యొకధనస్సు తీర్థ ప్రవాహంబునందు కానంబడుచున్నది. పుష్యశుద్ధ పౌర్ణమిదినంబున ఈ తీర్థస్నానంబుచే సకలపాప విమోచనంబును యిష్టసిద్ధియుం గలుగును.

* తుంబురుతీర్థము:—ఇది శ్రీస్వామివారి ఆలయంబునకు ఉత్తరముగా పండ్రెండు మయిళ్ల దూరంబులో నున్నది. తుంబురుయను గంధర్వఋషి ఈ తీర్థంబులో స్నానమాచరించి తపస్సుచేసి శ్రీనివాసమూర్తి యొక్క కటాక్షంబును బొందెను. ఫాల్గుణ శుద్ధ పౌర్ణమి దినంబున ఈ తీర్థస్నానంబుచే సకల పాపవిమోచనమును సాయుజ్యమును సిద్ధించును,

జాబాలితీర్థము:— ఇది శ్రీవారి సన్నిధికి పడమరగా రెండు మయిళ్ళ దూరంబులోనున్నది. పూర్వంబు జాబాలి మహర్షి తపస్సుచేసినస్థళంబు. ఇచ్చట శ్రీఆంజనేయులవారి ఆలయంబున్నది.

చక్రతీర్థము:—ఇది శ్రీవారి ఆలయంబునకు పడమరగా అరమయిలు దూరంబుననున్నది. అచ్చట తపస్సు చేయుచుండిన యొక బ్రాహ్మణుని, ఆప్రాంతంబులందుండిన రాక్షసుఁడొకఁడు హింసించనురాగా శ్రీనివాసమూర్తి తన చక్రాయుధంబును పంపి ఆ రాక్షసుని సంహరించి తనభక్తుల రక్షించునిమిత్తమై తన చక్రాయుధంబును ఆతీర్థఘట్టంబునందే యుండునట్లు నియమించిరి. ఇచ్చట చక్రత్తాళ్వారుల సన్నిధియు, లక్ష్మీనృసింహమూర్తి సన్నిధియు పురాతనమైన యొక గోపురమును యున్నవి. అహల్యను గూడిన

* ఈతీర్థముయొక్క విషయమై విశేషముగా దెలియఁగోరిన వారు శ్రీతరిగొండ వేంకబాంబచరిత్రమును చదివిచూడవలసినది. వెల 0-4-0



దోషనివారణార్థము దేవేంద్రుఁడు యిచ్చట తపస్సుచేసిన కారణముఁబట్టి దీనికి ఇంద్రతీర్థమునికూడా పేరు గలదు.

అస్థితీర్థము:—ఇది శ్రీవారి సన్నిధికి తూర్పుగా అరమయిలు దూరంబులో నున్నది ద్వాదశియందు స్నానంబు విశేషము.

నారదతీర్థము:—ఇది శ్రీవారిగుడికి మూడుమయిళ్ల దూరమున నున్నది.

తొట్టి తేకటవాతీర్థము:— ఇది శ్రీవారిగుడి యొక్క రెండవప్రాకారమందున్నది. బ్రహ్మహత్యగల మహాపాతకుఁడొకఁడు భరద్వాజమహర్షి ఆజ్ఞానుసారంబుగా శ్రీవేంకటాచలంబునకువచ్చి దీనియందుగ్రుంకి పాపవిమోచనుండై కృతార్థుఁడాయెను. ప్రతిశుక్రవారంబును శ్రీవేంకటేశ్వరుని యభిషేకజలంబు దీనిలో చేరుచున్నది,

విరజానదితీర్థము:—ఇది శ్రీస్వామిసన్నిధికి మూడవ ప్రాకారంబున వాయవ్యమూలయందు కూపంబువలె కానఁబడుచున్నది. శ్రీవేంకటేశ్వరుల పాదపద్మంబుల క్రిందుగా నదీరూపంబుగా ప్రవహించుచున్న తీర్థంబు దీనియందు చేరుచున్నది.

గజేంద్రపుష్కరిణి, ఆళ్వారుచెరువు:— ఇవి శ్రీవారి గుడికి దక్షిణ పడమరగా సమీపంబులో నున్నవి

పద్మతీర్థము:—ఇది తిరుచానూరు (తిరుశుకనూరు)లో నున్నది. దీనియందే శ్రీలక్ష్మీదేవి యవతరించి శ్రీనివాసుని

హృదయకమలముఁ జేరెను ప్రతిసంవత్సరము కార్తికమాసంబున బ్రహ్మోత్సవంబును, కార్తికశుద్ధ పంచమిదినంబున తీర్థవారియు, ఫాల్గుణ మాసంబున పద్మ తీర్థంబునందు తొమ్మిది దినములు శ్రీ దేవికి తెప్పోత్సవమును జరుగుచున్నవి. కార్తికమాస పూర్వపక్షపంచమిలో ఈతీర్థ స్నానమువల్ల లక్ష్మీకటాక్షము కలుగును.

నాగతీర్థము:— శ్రీవారి ఆలయమునకు పడమరవుత్తరముగా పాతికమయిలు దూరములో నున్నది. అచ్చట శేష. వాహనుండైన శ్రీనివాసుని విగ్రహములును, నాగేంద్రుని విగ్రహములును వున్నవి. ఒక గుహయున్ను కలదు.

శ్రీవైకుంఠతీర్థము.—(వైకుంఠగుహ మాహాత్మ్యము) ఇది శ్రీవారి సన్నిధికి తూర్పుగా రెండుమైళ్ళ దూరములో నున్నది. తీర్థమునకు సమీపమున యొకగొప్పబిలమున్నది. దానికి వైకుంఠ గుహయని పేరు. దాని ప్రసిద్ధిం జెప్ప నరులతరము కానేరదు. పూర్వము శ్రీరామచంద్రుడు రావణునిఁ ద్రుంచుకొఱకు ఆంజనేయ, సుగ్రీవ, నీల, జాంబవాదికపివరులతోఁ గూడిపోవుచు శ్రీ వేంకటాచలము యొక్క మార్గముగా రాగా, ఆకాశగంగ సమీపములో ఆశ్రమము నేర్పరచుకొని తప మాచరించుచున్న అంజనాదేవి వారిని శ్రీవేంకటాద్రికి వచ్చిపొమ్మని ప్రార్థించెను అందుకు శ్రీరామభద్రుఁడు తాను పోవుకార్యము ఘటనమయిన వెనుక వచ్చెదననుచుండగా ఆంజనేయులు శ్రీ రాములవారికి



ప్రణమిల్లి తనతల్లి ప్రార్థన నంగీకరించవలయునని ప్రార్థించెను. శ్రీ జానకీపతి మారుతిప్రార్థనల కియ్యకొనినవారై శ్రీ వేంకటేశ్వర మహాక్షేత్రమునకు వచ్చిరి. అప్పుడు ఆ క్షేత్రమందున్న మునిపుంగవులు వారిని అనేకవిధముల సన్నుతించి కృతార్థులైరి. పిమ్మట దాశరథి అంజనాశ్రమమునకుఁబోయి తత్సమీపమందున్న ఆకాశగంగలో స్నానసంధ్యాదినిత్యకృత్యముల నెరవేర్చుకొని నిలిచియుండగా అంజనాదేవి ఫలపుష్పముల వారికి సమర్పించి శ్రీరామ లక్ష్మణులం బూజింపగా, వారు సంతుష్టులైతదనంతరము శ్రీస్వామిపుష్కరిణికివచ్చి జయప్రద సంకల్పపూర్వకముగా స్నానమాచరించి తత్తీర్థ శృంగారవనంబున నివసించియుండగా, ఆంజనేయులు అనేకమధురఫల కందమూల తేనె పెసలు మొదలగువాటినిదెచ్చి వారికి సమర్పించెను. అప్పుడు రామలక్ష్మణులు వాటిని బరివారముతో విందారగించి పరిపూర్ణ సంతుష్టులైరి. అట్టిసమయమున కపులందఱు యిచ్ఛానుసారముగా విహరించుచుండగా కొందఱు శ్రీవైకుంఠగుహనుంగాంచి దానిలో ప్రవేశించిరి. అప్పుడు వారి పుణ్యలోచనములకు నవరత్న గోపుర ప్రాకారములును, మాణిక్య మరకత మౌక్తిక మంటపములును, చిత్రభవనములును, పచ్చతోరణంబులును, హేమరథంబులును, గొప్ప విశాలమయిన వీధులును కానంబడెను. అప్పుడచ్చట మహాప్రకాశమహిమచేనొప్పు రత్నకాంచన విమానమునందు

నీలాంబ్రభగాత్రుండై, శంఖచక్రగదాబ్జ సహిత హస్తుండై శ్రీ లక్ష్మీవల్లభుఁ డాయాధుండై యుండెను. అప్పుడు చిత్తవితలమును పొంది గుంపులుగా చూచుచున్న కపులను యొక వేత్రధరుఁడు తఱుముకొనివచ్చి వారలకు దారిచూపిపోయెను. మర్కటములు కాఁగాచివచ్చియు రావణాసురుని మాయ యేమోయని శంకించుచు సురల ఆగుహామార్గంబును వెదుకగా నది కానరాకపోవుటచేత, వారావృత్తాంతమును రామచంద్రునకు నివేదించిరి. వారప్పుడు కపులంజూచి శేషగిరి మాహాత్మ్యములం జెప్ప నెవ్వరికిని తరముగానేరదనియు, అచ్చట వివిధమహిమలున్నవనియు, వాటినిబరీక్షింప మీకు తగవనియు, మాధవుఁడు వైకుంఠమందుండునట్లు కరుణతో మీకు సందర్శనమిచ్చుటచేత మీరందఱు ధన్యులైతిరనియుఁ జెప్పి ఆదినం బచటగడిపి మఱునాడు కొండదిగిపోయి లంకఁజేరి రావణాసురుని సంహరించి సురల సాకేతపురముఁ జేరును.

శ్రీ మహావిష్ణువు వైకుంఠమునెడబాసి శేషగిరియందు వర్తించుచు కపివరులకు ఆ గుహాయందు వైకుంఠమును చూపిన కారణమునుబట్టి ఆపుణ్యగవికి వైకుంఠగుహాయని ప్రపంచములో పేరుప్రసిద్ధిఁ గలిగెను. ఆగుహాయందు యిప్పటికిన్ని నిత్యముక్తులచే సేవింపఁబడు శ్రీభూనీళా సమేతుండయి భగవంతుఁడుండు గావున ఆగుహాను హిమనువర్ణింప నెట్టిమహాత్ములకును శక్యము కానేరదు.



కపిలతీర్థము:— దిగువ తిరుపతికి ఒకటిన్నరమైలు దూరములో వుత్తరమునందున్నది. కపిలమహర్షి పాతాళమునందు యోగాభ్యాసము చేయుచు, లింగమొకటిని నిల్పి యర్చనము చేయుచుండగా అది మహామహాత్మ్యముచేత ధరను ఛేదించుకొని పృథ్విపైకివచ్చెను అప్పుడు సగరనందనులకు సద్గతి నిచ్చిన గంగ ఆలింగముతోకూడా వచ్చెను. దీని ఘట్టమునందు కపిలేశ్వర దేవాలయమున్నది. దాని ప్రక్కగా శ్రీనృసింహస్వామి గుడి యున్నది. దానిలో నొక గుహాయున్నది. పూర్వము తొండమాన్ చక్రవర్తి ఈగుహా గుండాపోయి శ్రీవేంకటేశ్వరుల నారాధించి వచ్చుచుండెను కపిలతీర్థమునకు ఆళ్వారుతీర్థమనికూడా చెప్పుటగలదు.

* శ్రీమత్ హాత్తిరాంభావాజీమఠస్థులు:—పూర్వము శ్రీవేంకటేశ్వరులతో యాడి పాడి వారితో సరిసమానముగ నుండిన మహాత్ముండును, వారి పరంపరస్థులును శ్రీవేంకటేశ్వర క్షేత్రమునకు యధికారులై మహంతు ప్రభుత్వమును వహించియుండిరి. కాలవశముచేత ఆ ప్రభుత్వము శ్రీహాత్తిరాంభావాజీ మఠస్థులకు తప్పిపోయి వుండెను. కాని వారి మహాత్మ్యము యించుకైనను తఱిగినది కాదు. సుమారు డెబ్బదియైదు సంవత్సరములక్రిందట ఈ మఠస్థులలో ప్రాము

* ఈమహాత్ముని చరిత్రమును చదువఁగోరినవారు శ్రీవేంకటేశ్వర భక్తవిజయమును తీసి చదివి చూడవలసినది. దానిలో శ్రీవేంకటేశ్వరుల యొక్క భక్తులచరిత్రముల నేకముగలవు వెల. 1—8—0

ఖ్యుండును, పరమభక్తుండునైన శ్రీమహంతు సేవాదాసుజీ వారికి మరల శ్రీవేంకటేశ్వరక్షేత్ర ప్రభుత్వము కలిగినది. వారి కాలములో శ్రీస్వామి పుష్కరిణి ఘట్టము, జలక్రీడ మంటపములు, జీర్ణోద్ధారణము చేయంబడినవి. దానికి నిదర్శనముగా శ్రీ స్వామిపుష్కరిణి తీర్థ పడమర ఘట్టంబున శిలాశాసన మొకటి యేర్పరచంబడి యున్నది.

* * * * * * *

“ దేవస్థాన విచారణకర్త మహారాజరాజశ్రీ,హత్తిరాంజీమఠ శ్రీమహంతు సేవాదాస్ నామ దేవస్యసత్పురుషః శ్రీ వరాహ శ్రీనివాస మహాతీర్థయోః మార్కండేయాగ్నియామ్య వసిష్టవరుణ వాయవ్య కుబేర గాలవ మధ్యే సరస్వత్యాది నవతీర్థసమాయు శ్రీస్వామిపుష్కరిణీ జీర్ణోద్ధారకృతానంతరే శ్రీమదలమేల్మంగా సమేత శ్రీనివాసస్య జలకేళి మంటపోత్సవ మకారయత్ ”

శ్రీ సేవాదాసుజీవారి శిష్యులు ధర్మాదాసుజీ వారు, వీరి కాలములో దేవస్థాన ముఖగోపురము గొప్పగా కట్టింపంబడినది. దానికి నిదర్శనముగా శ్రీ వారి కోవెలముఖ గోపుర వాకిలియందు కుడిపార్శ్వమున నొకశిలా శాసనమున్నది. దానిలో చక్కని సీసమాలికయొకటి వ్రాయంబడియున్నది.

“ శ్రీశాలివాహన శకమెన్నసాహస్రి అష్ట శతంబున శిష్టవిదిత। బహుధాన్యవత్సర భాద్రపదార్జున పూర్ణమతిథియందు పొందుగాను। శ్రీహరిగురుభక్త సేవాధురీణుండు



హతిరాం మఠశాలి ఆర్యసుగుణ। ధైర్యగుణాఢ్యుండు దానశూరుండనంగ సేవక దాసుజీ శిష్యఘనుడు ధర్మదాస్‌జీ యన ధన్యనామకమూర్తి శేషగిరీశుని చిత్తములర। గోపురంబునుచాల గొప్పగాగల్పించి భూరిదక్షిణలిచ్చి భూసురులకు। ధర్మంబు నాచంద్రతారార్క మగునట్లునిర్మించె మంటపాల్ నెమ్మితోడ। యిట్టి కైంకర్యపరులకు నీప్సితంబులిచ్చి వైకుంఠపదరాజ్యమిమ్ము। శ్రీశచిన్మయాచ్యుత జయశీల సింహరూప। విశదరవికోటిసంకాశ వేంకటేశా॥

శ్రీ ధనుర్దాసుజీవారి శిష్యులు భగవాన్‌దాసుజీ వారు, వీరికి వెనుక మెహింభీర్ దాసుజీవారును, వారికి వెనుక శ్రీరామ కిశోర్ దాసుజీవారును, వారిశిష్యులైన ప్రయాగ్ దాసుజీవారును మహాంతు ప్రభుత్వమును వహించిరి.

శ్రీరామలక్ష్మణదాసు భావాజీవారు యిప్పటి దేవస్థానాధికారులు. వీరు శ్రీహత్తిరాం మఠస్తులలో ప్రాముఖ్యులు. శ్రీమహంతు రాంకిశోర్ దాసుజీవారి ప్రియశిష్యులు. వీరికి భగవంతునియందు భక్తిశ్రద్ధలు మెండుగాగలవు. వీరు భగవంతుని యనుగ్రహముంబొందినవారై శ్రీహరి మూలస్థాన * గోపురముపై బంగారుకలశముస్థాపించి శ్రీవారి

---

* దీనిపైనుండిన కలశము సుమారు 300 సంవత్సరములక్రిందట పడిపోయినది. మరలదానిని స్థాపించుటకు యెవ్వరును సాహించకపోయిరి. శ్రీరామలక్ష్మణ దాసుజీవారు భగవద్భక్తులగుటచేత, వీరికి ఆకార్యములును సంపూర్తిజేయుటకు శ్రీనివాసుడు ఆజ్ఞనొసంగెను.

గోపురమును దగదగమెఱయునట్లు ప్రకాశింపజేసిరి. ప్రాతః కాలమున జీవకళలతోఁగూడి ప్రకాశించుచున్న ఆకలశదర్శనము పరమ గోప్యంబైయున్నది.

మరియు శ్రీరామచంద్రుఁడు లక్ష్మణ హనుమత్సమేతుఁడై శ్రీ వేంకటాద్రికి వేంచేసినకాలమునుండి శ్రీరామభద్రునకు వసంతవుత్సవము జరిపించబడుచుండెను. శ్రీకృష్ణ భగవానులు రుక్మిణీసమేతముగా శ్రీ వేంకటేశ్వరుల దర్శనమునకు వచ్చినకాలమునుండి వీరికిని వుత్సవములు జరిపించబడుచుండెను *శ్రీభాష్యకారులు తిరుమలకువచ్చి శ్రీనివాసమూర్తి యనుగ్రహపాత్రులైన కాలంబునుండి వీరికి వుత్సవంబు జరిపించబడుచుండెను. దానికి నిదర్శనంబుగా శ్రీవారి కోవలయందు శ్రీ రామలక్ష్మణ హనుమంతుల విగ్రహంబులును, శ్రీరుక్మిణీ కృష్ణపరమాత్ముల విగ్రహములున్నవి. ఈ వుత్సవములు కాలక్షశముచేత నిలిచిపోయి యుండినవి. అయితే శ్రీరామలక్ష్మణదాసు భావాజీవారు ఆవుత్సవములు మరల శాశ్వతముగాజరుగునట్లు వాటికి కావలసిన ద్రవ్యసాయములఁజేసి జరిపించుచున్నారు. మరియు శ్రీవారు వేంచేయుటకుగాను వసంతమంటపమును కడు రమ్యతరముగా కట్టించి అనంతశృంగారముల జేయించియున్నారు. శ్రీరామలక్ష్మణదాసుజీవారు జరిపించువుత్సవక్రమంబుల వివరము—

ప్రతిమాసము

* శ్రీభాష్యకారుల ప్రార్థనను చదువగోరినవారు శ్రీవేంకటేశ్వ ప్రార్థనయను గ్రంథమును చదివిచూడవలసినది. పేజి ౧—౩—౬.*



ఆరుద్రనక్షత్రమందు శ్రీవేంకటేశ్వరులు, శ్రీభాష్యకారులకును, రోహిణియందు శ్రీరుక్మిణీసమేత శ్రీకృష్ణభగవానులకును శ్రవణమందు శ్రీభూనీళా సమేతశ్రీవేంకటేశ్వరులకును, పునర్వసునందు శ్రీసీతారామలక్ష్మణ ఆంజనేయులకును వసంతమంటపంబునందు వుత్సవములు జరుగుచున్నవి మరియు ప్రతిసంవత్సరము శ్రీ రామనవమికి గొప్పమహోత్సవము జరుగుచున్నది.

దిగువ తిరుపతి:—దీనికి శ్రీగోవిందరాజపట్నమనిపేరు ఇచ్చట శ్రీగోవిందరాజస్వామివారి దేవాలయము శ్రీకోదండరాములవారి దేవాలయము, శ్రీ కపిలేశ్వరస్వామి దేవాలయము నున్నవి.

శ్రీగోవిందరాజస్వామి:—వీరు చిదంబరమను పట్టణములో నుండివచ్చిరి ఈచిదంబరమను పట్టణమునకు పూర్వకాలంబున చిత్రకూటమనిపేరు. చిదంబరమను పట్టణము శ్రీతిరుపతికి దక్షిణంబుగా యినుమ్నూటయేబదిమైళ్లు దూరంబున నున్నది. చిత్రకూటంబునందు ఆకాలంబున తిల్లైనాయకియను యొక పరమభక్తురాలు వుండెను. ఆపుణ్యాంగన శ్రీగోవిందరాజస్వామివారియందు పరమభక్తిఁగలిగి ప్రసిద్ధిగానుండెను. ఆకారణముఁబట్టి చిదంబరమునకు “తిల్లైచిదంబర” మనియును శ్రీగోవిందరాజస్వామికి “తిల్లైగోవిందరాజు” లనియును సుప్రసిద్ధమైనపేళ్లు కలిగియుండినవి. పరమ భక్తురాలైన తిల్లైనాయకి తన ప్రాణేశ్వరుండైన

శ్రీగోవిందరాజస్వామిని యేదో ఒకకారణంబువల్ల చిదంబరమునుండి శ్రీతిరుపతి పట్టణంబునకుఁదెచ్చెను. ఇచ్చట శ్రీ స్వామివారు నిత్యనివాసము నేర్పరచుకొనిరి.

యాత్రికులు శ్రీగోవిందరాజస్వాముల వారిని శ్రీ వేంకటేశ్వరులకు అన్నగారని చెప్పుచు వారి తిరునామమునే భజించుచు శైలారోహణముఁ జేయుచున్నారు. వైశాఖ జ్యేష్ఠ మాసంబులందు శ్రీ గోవిందరాజస్వామి వారికి 9 దినములు బ్రహ్మోత్సవము జరుగుచున్నది.

శ్రీకోదండరామస్వామి:— శ్రీరామ చంద్రుఁడు శ్రీ వేంకటాచలమునకు 1 వచ్చినకాలమున వారిరాక కొఱక గుఱుతుగా సేనాధిపతియైన జాంబవంతుఁడు వారికొక దివ్య దేవాలయముఁగట్టించెను. అది పూర్వమున కపిలేశ్వర సన్నిధికి తూర్పు దక్షిణముగా నుండెను. పిమ్మట ఆ దేవాలయమును యిప్పుడున్నచోట జనమేజయ మహారాజులు కట్టించి ఫాల్గుణమాసమున బ్రహ్మోత్సవంబు జరుగుచున్నది.

శ్రీ కపిలేశ్వరస్వామి:—2 పూర్వకాలమున శ్రీసుబ్రహ్మణ్యస్వామివారు కాశ్యపుని పుత్రుండైన తారకాసురుని సంహరించి తత్సంబంధముగాఁ గలిగిన దోషమునువారించు

1 శ్రీవైకుంఠగుహా మాహాత్మ్యమును చదివిచూడవలసినది. ఈగ్రంథముయొక్క 29వ పేజీలోనున్నది.

2 శ్రీకపిలతీర్థమాహాత్మ్యమును చదివి చూడవలసినది. ఈగ్రంథముయొక్క 82వ పేజీలోనున్నది.



కోఁదలంచినవారై, సకలపాప సంక్షయకరుండైన శ్రీవేంకటేశ్వరుల క్షేత్రంబునకు మయూర వాహనుండైవచ్చి శ్రీనివాసమూర్తినిఁగూర్చి ఘోరతపస్సుఁజేసెను అప్పుడు వారి యొక్కతల్లితండ్రులైన పార్వతీ పరమేశ్వరులు పుత్ర వాత్సల్యముచేత కుమారమూర్తినిఁ జూడ గోరినవారై శ్రీవేంకటాచలమునకువచ్చి శ్రీస్వామి పుష్కరిణిలో స్నానంబుగావించి సర్వోత్కృష్టుండైన శ్రీవేంకటేశ్వరబ్రహ్మమును దర్శించి పిమ్మట తమపుత్రునిఁగాంచి సంతసించి ఆస్వర్ణశైలమునుండి వచ్చుచు కపిలమహాఋషి చేతపూజింపఁబడి మహాత్మ్యముచే నొప్పుచున్న శ్రీకపిల లింగములోనికి ప్రవేశించినవారై నేటికిని అచ్చటనే యున్నారు. మహా శివరాత్రి, కార్తీకదీపము, విజయదశమి, వినాయక చవితి యీకాలములందు వుత్సవంబులు జరుగుచున్నవి.

శ్రీ వేంకటేశ్వరుల వుత్సవకట్టనములు:— బ్రహ్మోత్సవము, ఇందులో అయిదు తరగతులు గలవు. రూ. 1005. రూ. 705, రూ. 664, రూ. 568, రూ. 525, వసంతోత్సవము రూ. 705, కల్యాణోత్సవము రూ. 255, వజ్రకవచ వాహనములు రూ. 61, వజ్రకవచములేని వాహనములు రూ 41 గరుడవాహనము మొదలగునవి రూ. 21.

శ్రీ వేంకటేశ్వరుల సేవలు, వాటికికట్టణములు:— ఉదయమున విశ్వరూపదర్శనము, 10 ఘంటలకు మొదటి తోమాలసేవ, మధ్యాహ్నము మొదటిఘంట దర్శనము,

3 ఘంటలకు రెండవఘంట దర్శనము, సాయంత్రము రెండవ తోమాలసేవ పిమ్మట, రాత్రిఘంట దర్శనము రాత్రితీర్థా నమానప్పుడు పాన్పుసేవ, (ఏకాంతసేవ). గురువారమున పూలంగిసేవ. శుక్రవారమున తిరుమంజనము.

కర్పూరహారతికి తిరుమంజనసేవ. పూలంగిసేవకు రూ. 1—0—0. తోమాలసేవకు, ఏకాంతసేవకు అయిదు గురికి రు. 13, అర్చనకు నలుగురికి రు. 7. ప్రత్యేకముగా సేవలు జరిపించుటకు:—పూలంగిసేవ రు. 60, అద్దాల మహల్ రు. 61, ఆమంత్రణోత్సవము రు. 65, తిరుపావడ రు 355. పూరాతిరుపావడ రు. 705. కోవెల తిరుమంజనము రు. 505, సహస్రకలశాభిషేకము రు. 1005.



# శ్రీ వేంకటేశ్వర కీర్తనలు.

రాగం - కమాసు - ఆదితాళం

పల్లవి. ఈశ ప్రణవ ప్రకాశ జగదీశా శ్రీవేంకటేశ ॥ఈశ॥

అనుప. వాసిగాను నిన్ను గొల్చు దాసులను బ్రోవు శ్రీశేషగిరి
వాస చిదాకాశ హరిబం నేశముకోరిన వరదాన
మనోల్లాసయోగా ధ్యానులను బ్రోవు పరమేశా జగ
న్నివేశ ఈశ॥

చరణ. కోరి వల్మీకమును చేరియుండ స్వామినీవు దారిగని వచ్చి
గోవుక్షీరములను గారాబముతోను యపారముగ



కురిపించ సారముగ గ్రోలినట్టి వారిజ నళినహారి ॥ఈశ॥

ఎచ్చు ప్రాయముచేత నొచ్చియున్న కౌండిన్యుని ముచ్చట
బాలునిఁజేసి మెచ్చు యచురుల్ ఇచ్చకనుగుణ్యముగ
యిచ్చి వరములచాల స్వచ్ఛముగ బ్రోచినట్టి సచ్చి
దానందాత్మహరి ॥ఈశ॥

దండిగ ఆకాశగంగ పాండవ పాపనాశ మెండుతీర్థముల
గ్రుంకి పుండరీకాక్ష దండములుపెట్టనీకు కొండవంటి
పాపములు యెరిదుకసుప్పలరాశి మండిపోవునట్లు
మాడు ॥యీశ॥

తారకాసురునిఁ జంపి వీరుఁడు కుమారస్వామి కోరివచ్చి నీదు
గిరిఁ జేరి తపముల్ సారముగఁ జేయవరి వారముతో
వచ్చివారి నేరములబాపి సుప్ర సాగరముగ బ్రోచినట్టి
॥యీశ॥

గుల్మకుష్ట మేహశూల కల్మషరోగములెల్ల నిర్మూలముఁ
జేయునట్టి శర్మదమూర్తి నిర్మలస్వాంతంబుతో నీ
మర్మమెఱిఁగి వేడినంత కర్మబాధ లేదుయట్టి జాల్మ
లకు నైనగాని ॥యీశ॥

దేశదేశమునుండి దాసులు విశేషముగ ఆసమీఱవచ్చి
వేంకటేశయనుచు రాసులుగ ధనములు మోసుకొని
వచ్చినీకుపోసి శరణని సేవఁ జేసిపోవుదురయ్య ॥యీశ॥

సంకర కిరీటయతి పుంగవనిజాంతరంగ భృంగరిపుతి
మిర పతంగపావనా లింగశైల రాజ ఉత్తుంగ

కరుణతో శ్రీరంగప్రకాశునిల రక్షించు శృంగారధీర।

। ఖూళ।

రాగం నాధనామక్రియ అటతాళం.

పల్లవి. చూచివత్తాము రారమ్మ శ్రీవేంకటేశుని।చూచి।

అనుప. చూచివత్తము రారె సుదతులారా మనము రేచకవీధిలో రేపగలు లేనివాని ।చూచి।

చరణ. తులసీదళముల మాలధారుఁడట నలలిత శుక్లాంబరధరుండట వలనొప్పెడువిశాలవక్షుఁడట కలియుగ యోగి నారాయణుఁడట ।చూచి।

శంఖచక్రములు పట్టినవాఁడట పంకజనాభముకలిగిన వాఁడట కంకణభూషణజాలధరుండట నంకటముల నమయిం చెడివాఁడట ।చూచి।

పద్మావతి హరి ప్రక్కనుండునట పద్మనళాక్షుఁడు హరి జాతుఁడట పక్షిభుజంగము భక్తిచేయునట పాదమందున పారును గంగట ।చూచి।

ఏడుకొండలు ఎక్కవలయునట వేడుక తీర్థముల్ మునుఁగవలయునట జోడుహస్తముల మ్రొక్కవలయునట జ్యోతినిరామయ బ్రహ్మంబతఁడట ।చూచి।

అభయహస్తవరముద్రధరుండట విభవోన్నతముగ వెలుంగువాఁడట భవబాధలను బాపెటివాడట భక్తులను యెడబాయఁజాలఁడట।చూచి।

మంగళకరముగ వెలిగెటివాఁడట మహనీయులకే



చిక్కనవాడట అంగములో సిరికలిగినవాడటగంగ ప్రకాశుని రక్షకుఁడతఁడట ।చూచి।

రాగం ధన్యాసి ఆదితాళం.

పల్లవి. శ్రీధరమాధవ సాధుమనోహర వేదకల్ప వేంకటాద్రిపతే నీదయదివ్య ప్రసారమునివ్వరనిత్యామృత వైకుంఠపతే । చరణములు । కేశవదుర్జననాశనయాది శేష శయన త్రైలోకపతే దానవపోష మణిభూషణలక్ష్మి నేశవిశే ష కైవల్యపతే । శ్రీ । నీలశరీర నిర్మలచరితా లీలావతార పద్మపతే మాలధార గోపాలసుందర మంగళవిగ్రహ మోక్షపతే । శ్రీ నారదవ్యాస పరాశరసన్నుత దీరగాత్ర దేవేంద్రపతే నారాయణ క్షీరాంబుధిశయనా నీరజనాభ నలువపతే । శ్రీ । ఆపద్బాంధవ యున్నతచరణా గోపబాల సర్వాత్మపతే శ్రీపతి తిరుపతిపుణ్యవిలాసా సిద్ధసాధ్య యమ రాధిపతే । శ్రీ । పరమదయాళా ప్రహ్లాదార్చితనిరుపమకోటి భానుపతే శరధివిశోషణ రంగప్రకాశాసరసదయాపర యోగ పతే । శ్రీ ।

రాగం ఇంద్రసభా అటతాళం.

॥ పల్లవి । శ్రీవేంకటేశా సిరిమనోనేశా భావాతీత పరబ్రహ్మప్రకాశా । అనుప । భూవనములోన పావనులను బ్రోవ దేవుఁడై మహానుభావుఁడై వెలసిన । చరణ । మొరలనువినరా మురహరిధీర కరుణించికన్నుల దరిశించ వేరా సురగణసన్నుత పరమదయాళ నిరతమునీకృప కురిపించ

వేరా ॥ శ్రీ ॥ నాతోనువాదా వేదాంతబోధా జ్యోతినిరామయు సచ్చిదానంద ఖ్యాతిగనీదివ్య కరావలంబను ప్రీతితోనిచ్చి ప్రఖ్యాతిగబ్రోవర ॥ శ్రీ ॥ దురితనివారా దుష్టసంహారా నిరతిశయానంద సరధివిహారా పరమపురుష దివ్యకరుణామపారా నిరుపమసౌందర్య వరయువతారా ॥ శ్రీ ॥ గోవిందనామ గోకులసోమ కావరకరుణించి కమలాంబప్రేమా మాన్యథబాధల మాన్పినీభక్తిని జీవనముగనిమ్ము దేవపరంధామ ॥ శ్రీ ॥ మంగళాకారా మహితగంభీర శృంగారదృష్టితాంగవొయ్యారా గంగజయంఘ్రి భుజంగ విహారా రంగ ప్రకాశా రక్షణకారా ॥ శ్రీ ॥

రాగం నానక్ హిందుస్థాని.

॥ పల్లవి ॥ వేంకటేశ శ్రీవైభవకారా పంకేరుహ నేత్రహరి శ్రీ ॥ అనుప ॥ సంకటములనుదీర్చిబ్రోవర సరధిజ సన్నిత్ర ॥ చరణ ॥ కరుణాకడలినిసయనములందు ధరియించిన స్వామి నమముయుకదరిజేర్చుకోమి పరమపదదార నిరుపమైన మీచరణముల్ నమ్మితిమి ॥ వే ॥ యురమునలక్ష్మి మెలియుచునుండే వరవైభవకారా మహాత్మ సురభక్తోద్ధార నిరయవెరవులదీర్చిబ్రోవర దురితదుష్టదూర ॥ వేం ॥ తలచినప్పుడే నిలచునపాపము శిలలైననుగాని బహు వెల్లువలైననుగాని నలనొప్పెడు నీపాదపంకజముల భక్తితోపూని ॥ వేం ॥ చిలువలదొరపై విలసిల్లెటినుర తిలకము వేదఘోష చరాచరములకును నిత్యపోష సలలితముగభక్తజలధిచంద్రుండై వెల



సెటినగ్వేశా ॥ వే ॥ ధరను తిరుపతి పురమున వెలసెటి కరుణాకరనయనా సురాంబుధి వరపన్నగశయనా నరసదయాపర రంగప్రకాశా సత్కృపఘనవాస ॥ వేం ॥

రాగం అహిరి చాపుతాళం.

॥ పల్లవి ॥ భటులార యిదివినరే వేంకటవిఠలుని మదినుంచరే ॥ అనుప ॥ కఠినములనిమీరు పాతకము విడవక వటపత్రశాయిని స్ఫుటమునగానరే ॥ చరణ ॥ శ్రోత్రమ యిదివినుమి నీకునున్నుంచి సూత్రము కనుంగొనుమి ధాత్రిమాకులశ్రేష్ట చిత్రముంకుపోక రేత్రిపగలుకగుణ నేత్రుని ధ్యానించు ॥ బటు ॥ చర్మేంద్రియమువినుమి భూలోకమున కర్మాలపొందు మానుమి మర్మనుముతోనింక నిర్మలముగ పరబ్రహ్మచింతలె గొప్పధర్మములనినమ్మి ॥ భటు ॥ చక్షుజంటల వినుడి ఈలోకమున తుచ్ఛకాంచలమానుడి అక్షయమంగళునపేక్షజేసియు లక్ష్యమునిల్పియు లుచ్చబుద్ధులమాని ॥ భటు ॥ నాలుకధాగుణిలోరుచులపొందు చాలించి యిదివినుమా మేలుగవరలక్ష్మిలోలుని భక్తినుద గ్రోలుచునింకను కాలముగడుపుమి ॥ భటు ॥ ఘ్రాణేంద్రియమువినుమి సకలజగ ప్రాణనాథుసిగనుమీ మానితముగ సర్వమంగళాకారుని పూనిభజించుట పుణ్యోత్సవమని ॥ భటు ॥ చలనబుద్ధుల మానవె మనసానీలో జలజాతుగనుగొనవె అలవరమాత్మెని అమృతవీధిలోపుల రంగప్రకాశు పలికివాడనినమ్మి ॥ భటు ॥

# శ్రీ వేంకటేశ సుప్రభాతమ్.



శ్లో॥ వన్దే శ్రీనయనోత్సవస్య శశినం శేషాచలాధీశ్వరం ।
బ్రహ్మాద్యర్చిత పాదపద్మయుగళం లోకైకనేత్రోత్సవమ్
వాసిష్ఠైస్సనకాదిభిర్మునిగణైః సంసేవ్యమానం సదా ।
భక్తానామఖిలార్థదాయినమహం శ్రీవేంకటేశం గురుమ్ ॥

శ్లో॥ కౌసల్యాసుప్రజా రామ పూర్వాసన్ధ్యాప్రవర్తతే ।
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥

1. మాతస్సమస్తజగతాం మధుకైటభారేః
వక్షోవిహారిణి మనోహరదివ్యరూపే ।
శ్రీస్వామిని శ్రితజనప్రియదానశీలే
శ్రీవేంకటేశదయితే తవసుప్రభాతమ్ ॥

2. తవసుప్రభాత మరవిన్దలోచనే
భవతుప్రసన్న ముఖచన్ద్రమణ్డలే ।
విధిశఙ్కరేంద్ర వనితాభివన్దితే
వృషశైలనాథ దయితే దయానిధే ।

3. అత్ర్యాదిసప్తఋషయస్సముపాస్య సన్ధ్యా
మాకాశసింధు కమలాని మనోహరాణి ।
ఆదాయపాదయుగ మర్చయితుం ప్రపన్నా
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥



4. పఞ్చాననాబ్జభవషణ్ముఖ వాసవాద్యా
స్త్రైవిక్రమాదిచరితం విబుధాస్స్తువన్తి ।
భాషాపతిః పఠతివాసరశుద్ధిమారా
చ్ఛేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥

5. ఈషత్ప్రఫుల్ల సరసీరుహ నారికేళ
పూగద్రుమాదిసుమనోహర పాలికానామ్ ।
ఆవాతి మన్ద మనిలస్సహదివ్యగన్ధై
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥

6. ఉన్మీల్యనేత్రయుగ ముత్తమపంజరస్థాః
పాత్రావశిష్టకదళీ ఫలపాయసాని ।
భుక్త్వాసలీల మథకేళిశుకాః పఠన్తి
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥

7. భృంగావళీచ మకరన్ద రసానువిద్ధ
ఝఙ్కారగీతనినదైస్సహసేవనాయ ।
నిర్యాత్యుపాన్తసరసీ కమలోదరేభ్యః
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥

8. తన్త్రీప్రకర్షమధుర స్వనయావిపఞ్చ్యా
గాయత్యనన్తచరితం తవ నారదోపి
భాషాసమగ్రమసకృత్కర చారురమ్యం
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ॥

9. యోషాగణేనవరదధ్ని విమథ్యమానే
ఘోషాలయేషు దధిమన్థన తీవ్రఘోషాః ।

రోషాత్కలిం విదధతేకకుభశ్చకుమ్భాః
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

10. అన్తర్ధధే తిమిరజాలమథాన్తరిక్షే
ఘంసాని జేన సమేత్యచ చక్రవాకీ ।
తారస్వనైస్సమముదేతి చతామ్రచూడ
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

11. క్షోణీధరాగ్ర సరసాం సరసీరుహాణి
ప్రాణానిమన్త్రితజలాని మహీసురాణామ్ ।
చణ్డాంశుసారథికరాః ప్రచరన్తిచోర్ధ్వం
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్

12. పద్మేశమిత్ర శతపత్ర గతాళివర్గా
హర్తుం శ్రియఙ్కువలయస్య నిజాఙ్గలక్ష్మ్యా ।
భేరీనినాద మివకుర్వతిఝఙ్క్రియాభి
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

13. శ్రీమన్నభీష్టవరదాఖిలలోకబన్ధో
శ్రీ శ్రీనివాస జగదేక దయైకసిన్ధో
శ్రీదేవతాగ్రహ భుజాన్తర దివ్యమూర్తే
శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్।

14. శ్రీ శేషశైలగరుడాచల వేఙ్కటాద్రి
నారాయణాద్రివృషభాద్రి వృషాద్రిముఖ్యాః ।
ఆఖ్యాన్త్వదీయవసతే రనిశంవదన్తి
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।



15. శ్రీ స్వామిపుష్కరిణికాప్లవ నిర్మలాఙ్గా
శ్రేయోర్థినో హర విరిఞ్చిసనన్దనాద్యాః
ద్వారేవసన్తివరవేత్రహతోత్తమాంగా
శ్శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్ ।

16. త్వత్పాదధూళి భరణస్ఫురితోత్తమాఙ్గా
స్స్వర్గాపవర్గ నిరపేక్ష నిజాన్తరంగాః ।
భక్తావసన్తి భువికిఙ్కర కృత్యలోలా
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

17. త్వద్గోపురాగ్రశిఖరాణి నిరీక్షమాణా
స్స్వర్గాపవర్గ పదవీ పదమాశ్రయన్తే ।
మర్త్యత్వమత్రభువనే సురనాయకాద్యా
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

18, శ్రీభూమినాయక దయాదిగుణామృతాబ్ధే
దేవాదిదేవజగదేక శరణ్యమూర్తే ।
శ్రీమన్ననన్త గరుడాది భిరర్చితాఙ్ఘ్రి
శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్ ।

19. సూర్యేన్దుభౌమ బుధవాక్పతికావ్యసౌరి
స్వర్భానుకేతుదివిషత్పరి షత్ప్రధానాః ।
త్వద్దాసదాసచరమావధి దాసదాసా
శ్శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

20. సేవాపరాశ్శివసురేశ కృశానుధర్మ
రక్షోమ్బునాథ పవమాన ధనాధినాథాః ।

బధ్వాఞ్జలిమ్ప్రవిమలే నిజశీర్షదేశే
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

21. ధాటీషు తే విహగరాజమృగాధిరాజ
నాగాధిరాజగజరాజ హయాధిరాజాః ।
స్వస్వాధికార మహిమాధిక మర్థయన్తే
శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్ ।

22. శ్రీపద్మనాభ పురుషోత్తమ వాసుదేవ
వైకుణ్ఠమాధవ జనార్దనచక్రపాణే ।
శ్రీవత్సచిహ్న శరణాగతపారిజాత
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

23. కన్దర్పదర్పహర సున్దరదివ్యమూర్తే
కాన్తాకుచాంబురుహ కుట్మలలోలభృఙ్గ
కల్యాణనిర్మల గుణాకర దివ్యకీర్తే
శేషాద్రి శేఖరవిభో తవసుప్రభాతమ్ ।

24. మీనాకృతే కమఠకోల నృసింహవర్ణిన్
స్వామిన్ పరశ్వథ తపోధన రామభద్ర ।
శేషాంశరామయదు నన్దనకల్కిరూప
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

25. ఏలాలవఙ్గఘన సారసుగన్ధతీర్థం
దివ్యంవియత్సరసి హేమఘటేషుపూర్ణమ్ ।
ధృత్వాద్య వైదిక శిఖామణయః ప్రహృష్టా
స్తిష్ఠన్తివేంకటపతే తవసుప్రభాతమ్ ।



26. లక్ష్మీనివాస నిరవద్యగుణైకసిన్ధో
సంసారసాగర సముత్తరణైకపోత ।
వేదాన్తవేద్య నిజవైభవభక్తభోగ్య
శేషాద్రిశేఖరవిభో తవసుప్రభాతమ్ ।

27. భాస్వానుదేతివికచాని సరోరుహాణి
సమ్పూరయన్తి నినదైఃకకుభోవిహఙ్గాః ।
శ్రీవైష్ణవాస్సతత మర్థితమఙ్గళాస్తే
ధామాశ్రయన్తి తవవేఙ్కటసుప్రభాతమ్ ।

28. ఇత్థం వృషాచలపతే రిహసుప్రభాతమ్
యేమానవాః ప్రతిదినమ్పఠితుమ్ప్రవృత్తాః ।
తేషామ్ప్రభాతసమయే స్మృతిరఙ్గభాజా
మ్ప్రజ్ఞామ్పరార్థ సులభామ్పరమామ్ప్రసూతే ।

శ్రీవేంకటేశ సుప్రభాతమ్ సమాప్తం.

---

శ్రీవరాహస్వామి దండకము.

శ్రీమన్మహాశ్వేత సత్కోడరూపాయ నిర్లేపబోధ ప్రదీపా ప్రతాపోజ్జ్వలా శ్రీప్రభూపా హిరణ్యాక్ష కాలిన్య దేహాత్రి దంభోళిధారాసురాధార ధాత్రీతలోద్ధార భర్త్రాద్రి ధీరా జగత్సార చిత్సార భూతాభవాంభోధి పోతా సుమోక్షప్రదాతా గుణాతీత వేదార్థనిర్ణేత పూతాత్మధాతా మహాపంచభూత ప్రభూత ప్రపంచాకరా శ్రీకరా సుప్రసన్నా

---

* శ్రీతరిగొండ వేంకమాంబ విరచితము.

త్మవై మమ్మురక్షించుమీశా రమాధీశ నీసత్ప్రభావంబు
లెన్నన్ సహస్రవనుండైన దానోపునే మాకు శక్యంబె
నీయుగ్ర దంష్ట్రాకరాళాస్యమున్ నీనటల్ వేడిచూడ్కుల్
మహాభీకరాకారముంజూడ మాకే యసాధ్యంబుగా దోచె
లోకంబులో మానవవ్రాతముల్ చూచి భీతిల్లరే తండ్రి
మమ్ముద్ధరింపన్ సదా సౌమ్యరూపంబు వేదాల్చి శ్రీభూమి
నీళాసమేతుండవై దేవతిర్యఙ్మనుష్యాఖ్య జీవాళులందోచు
చున్ సర్వనిత్యోత్సవంబు ల్మహాభక్తబృందంబు లర్పింపగా
దివ్యలీలాప్రభావంబులం జూపుచున్ మీరుక్రీడాచలంబందు
వేంచేసి యుండుండ హోపూర్ణ కామా గుణస్తోమ దేవో
త్తమా దేవతా సార్వభౌమా తరిగొండధామా నృసింహా
హ్యతావ్హా వరాహావతారా నమస్తే నమస్తే నమస్తేనమః॥

## శ్రీ శ్రీనివాస దండకము.

శ్రీమత్పరంధామ జీవావళిస్తోమ శ్రీమానినీ లోల
శృంగార సల్లీల కందర్ప లావణ్య కంజోద్భవాగణ్య పాడ్గు
ణ్య సంపన్న సంరక్షితావన్న సత్యవ్రతాచార సాధువ్రజో
ద్ధార సారాంబుదశ్యామ సంపూర్ణ సత్కామ వేదాంత
సంచార విశ్వంభరాధార శ్రీవేంకటాద్రీశ సచ్చిత్ప్రకాశా
పరాకాశ లోకేశ వాగీశగౌరీశనాకేశ వంద్యాంఘ్రిపద్మ
ద్వయా నిత్య సత్యద్వయాసద్దయాసాంద్ర యోగీంద్రహృ
త్పద్మ భృంగాశుభాంగా సుచారిత్ర మిత్రాబ్జనేత్రా ధరి
త్రీకళత్రా మహోల్లాస దాసప్రియా శ్రీనివాసా మమున్
సత్కృపన్ జూడుమో తండ్రి శ్రీతరిగొండవాసా నృసింహా
హ్యతాంహా నమస్తే నమస్తే నమస్తేనమః॥

* శ్రీతరిగొండ వేంకమాంబ విరచితము.



## తత్వము.

ముఖారిరాగం - అటతాళం.

వృథాశాయబోకు జన్మము సదారాదునీకు - నిదా
నించిమదిలోసాదించక - చిదానందమూర్తినిధ్యానించక॥వృ॥
వుత్తమజన్మమురా దీనిని వ్యర్థముచేయకురా - వుత్తసంసార
మురా లేపిది ముక్తిరూపమరా - కారణగురుకృపనూ పూ
ర్వకర్మమెల్లబోను - నీదారిమంచిదవును సర్వము తానేతాన
గును-యేమరకను శ్రీరామునిదలువక తారకబ్రహ్మవిచారము
దెలియక ॥వృ॥ వేదాంతముజదివి పూరిక వాదులాడరాదు-
నీసాదుసేవక నీనిదిబోధకురాబోదు - భేదమువదలిన భేదబుద్ధి
చే - సాధకములునాల్గునుసాధించక॥వృ॥యీదేహమునందు
బాగుగ బోధనచేయవలెన్ నాదుబిందువేతకి సేతువ మాధ
వకూడవలెన్ ॥వృ॥

పార్శి.

కన్నడరాగం - అటతాళం.

సప్తగిరీశ్వర బెరబెరవెడలేటు - సంతసమొప్పగరా
వేరా - సామజపాల మొరచెవివినుమా సామజమీరగంభీర
॥సప్త॥ నాతోవాద శ్రీనివాస నమ్మియున్నారా ॥సప్త॥

## శ్రీ వెంకటేశ్వరుల కీర్తన.

శ్రీవేంకటేశామాంపాలయ - నాదుచిత్తంబు నిన్ను
నమ్మినానయాఅలేభావజజనకారావే - నాపాలిటిదైవమునీవే
॥అరే॥శ్రీవేం॥ మంగజజనకారావే - నిన్ను కోరివేడితినినేనే
॥ శ్రీవేంక ॥

శ్రీనివాస శ్రితజనపోషా - పన్నగాధిశయననాతో
పలుకవేమిరా - దాసపోషకా యిది ధర్మమటరా - దాస

దాసుడైన వెంకట దాసునేలరా ॥శ్రీ॥ యెంతని వేడుదు యదుకులవంశ - చింతలన్నిదీర్చినన్ను చేరదీయరా ॥శ్రీ॥

ముఖారి - అటతాళము.

నిన్నునమ్మియున్నవాడవా శ్రీవెంకటేశ ॥ని॥ మున్ను వేద వతియునిన్ను మోహించితపముజేయ కన్నానేనిన్ను నేలుదుకలియుగమునందు ॥ని॥ అన్నిభాసజేసినావు అలక్ష్మినివిడచినావు అంతలోవయికుంఠ మొదలియు అర్చావతార ॥ని॥ గగనభూపాలునింట కాంతవేదవతియు బుట్టి కాంచియుండె నీదురాకకు కాంతాపద్మజా ॥ని॥ వనితసఖులతోడగూడి వనముసపుష్పములుగోరి వచ్చిమదినిమెచ్చుచుండిరి ఆవనమునందు ॥ని॥ తిరుమలకొండయందు తింత్రిణి వాల్మీకమందు వెలశివేటలాడుచుండగా శ్రీవెంకటేశా ॥ నీదుమాయ తెలియ వైరెరి నిన్నుబోయువాడనిరి-శిలలుచేత చాలకువ్విరిఆస్త్రీలుచేరి తత్తరంబుజెందివచ్చి తల్లితోనెరింగించి దాన్నినన్ను గూర్చుమంటివి ధరలోననీవు ॥ని॥ అనిసముద్దుమాటలిని అట్లనేకాని మ్మటని అచటనుండితల్లిబోగకు అంతలోననీవు ॥ని॥ ధరణిదేవి కెరుకచెప్పి తలచితరుణిరూపుదాల్చి ధరణికి యీతెరుగు దెల్చియు అదృశ్యమయినావు॥ ని॥ అంతచారునంతసించి అతివనిచ్చి పెండ్లిచేశి అదరించుచునుండబల్కిరి ఆదంపదులు ॥ని॥ ధరనుతిరుపతిపురమున దాసులకుదాసుడైనదాసుడౌకన్నయ్య నేలుమా ధరలోనరామ॥

మేలుకొలుపులు.

వెంకటేశ్వర వేదవేదాంతవేద్యని న్యేడుచుంటిని నిద్ర మేలుకో-పంకజమాలరశుభాలంకారబాలక - శంకమా?



మిత్రమేలుకో॥ దేవమేలుకో॥ అండపిండ బ్రహ్మాండ భాండమెల్లనిండిన పరమాత్మమేలుకో భంజనదేమునవేడు- కొండాపైవాసముండిన శ్రీధరమేలుకో॥ దేవమేలుకో॥ అంగనలెల్లల జయమంగళము నీకొసంగవచ్చిరి నిద్రమేలుకో - పొంగుచు నలమేలు మంగతో జగముల బ్రోవగవలెను మేలుకో॥ దేవమేలుకో॥ భానుడుదయించెను పద్మముల్ వికసించె బాలవెంకటరమణ మేలుకో -. పూనికతోభక్తపుణ్యాత్ములను జూచి బ్రోవగవలెనిద్రమేలుకో॥ దేవమేలుకో॥ ముచ్చటబడినీకు ముడుపులు చెల్లించవచ్చియున్నారయ్య మేలుకో- వచ్చినవారికి వరములొసగవలె వరద వేదాద్రీశమేలుకో ॥దేవామేలుకో॥ పరమభక్తులునీదు పాదాబ్జములుజేరి - స్మరణచల్పుచునుండె మేలుకో - కరుణనుంతినవెంకటదాసుడిప్పుడే కాంతమాడగ వచ్చెమేలుకో॥ దేవమేలుకో॥

(హెచ్చరిక.)

ఆనందభైరవి రాగము,

హెచ్చరికెపాండురంగనాథ హెచ్చరికె - హెచ్చరికె వేదాంతబోధ హెచ్చరికె॥ వనజసంభవజనక వంద్య హెచ్చరికె సనకాదివందిత స్వామి హెచ్చరికె॥ సహస్రఫణాపణి శయన హెచ్చరికె - మహారాజరాజశ్రీ మహిత హెచ్చరికె॥ పరరమ్యతియుపతిని వాసహెచ్చరికె - ధరరామానుజపాల ధన్య హెచ్చరికె॥

(లాలి.)

ఆనందభైరవి రాగము,

లాలిగోపాలలాలి రుక్మిణీ లలనాత్మలోలాలి - లాలి

భూపాలలాలి సకలకల్యాణగుణజాలలాలి॥ నందనుకుమార లాలి గోక్షీర నవనీతచోరలాలి- మందరోద్ధారలాలి శతకోటి మన్మధాకారలాలి॥ పరమ గోవిందలాలి రమణీయపాదారవింద లాలి - సురగుణానందలాలి పండరీ సుందరముకుందలాలి॥ వరవేంకటేశలాలి తిరుపతిని వాసప్రకాశలాలి - వరదసర్వేశ లాలి లోకపావనహృషీకేశలాలి॥ జలజదళనేత్రలాలి రామానుజాఖ్య సంస్తోత్రలాలి - జలదనిభగాత్రలాలి సాధుసజ్జన హృదయ పాత్రలాలి॥

పార్శి - నోట్, చాపుతాళము.

శ్రీరామచందిరనె శ్రీలోలసుందిరనె శ్రీమన్నారాయణనె రాం రాం రాం॥ తేడినేఁ పుగళ్ పాడినేఁ శ్రీగోవిందముకుందనె గోపాలవైకుందనె కోటీశరణం శెయ్యం రాం రాం రాం॥ దశరథపుత్రియనె దాసాకుమిత్రియని తాటకిసంహారియనే రాం రాం రాం॥ కౌసల్య కొమారనే శ్రీరామచంద్రుడనే సీతామనోహర రాం రాం రాం॥ కైకేయివరములు కానాననంబునా కారుణ్యజెడునందె రాం రాం రాం॥ చిత్రకూటాద్రిలో పర్ణశాలలోపోయిమారీచు తెగవేసె రాం రాం రాం॥ కిష్కింధకునుబోయి సుగ్రీవునిశేవకాసి వాలిని బడవేసె రాంరాంరాం॥ పగవానితమ్ముడు యీనాకయెంచా క విభీషణపట్టంకట్టె రాంరాంరాం॥ చేతూవుయేగట్టి లంకాకునేబూడ్చీ లంకిణితెగవేసె రాంరాంరాం॥ కోటాయేదాటి కుంభకర్ణునిబట్టి నేలబడవైచిన రాంరాంరాం॥ రావణాసురునిబట్టి ఘోరయుద్ధముచేత నేలబడవేసె రాంరాంరాం॥ నేలాగుసీతా దేవినిలంకలోనుంచీదెచ్చిన రాం రాం రాం॥

రాగము కల్యాణి. రూపకం.



॥ పల్లవి ॥ రారా వేంకటగిరివాసా నాతోను నేను పోరాడ బహుచటుల అనుప ॥ నేరానేరములతోను ఘోరయుద్ధము జేతు. నేరమెంచక కృపజూడ రా నేజాలదనున్న ॥ చరణ ॥ సిరులిచ్చినావనియెల్లను భూమిలో సర్వ ధనములిచ్చిన వెల్లను అరవిందపదముల స్థిరముగ నివ్వనున్న కరములంటి నిన్ను కరుణకోరుర తండ్రి ॥ రారా ॥ ధరణి యధికారమెల్లను కైలాసవర గిరిశాధిపత్యమెల్లను శరణకమలములను కురిపించనున్న కోపగించితుండై చీకాకు పరతునునాస్వామి ॥ రారా ॥ భువనత్రయమెల్లను యీలోకమున దేశాధిపత్యమెల్లను వాళిగ నన్ను చాల నేరముజేయనున్న శేషశయననిన్ను క్లేశముబెట్టినైతు ॥ రారా ॥ లక్ష్మినికి వెలుపబోనురా దేవాదులెన్న్నో లక్ష్యలైననుకాదురా పతులతోను దయవీక్షించనున్న సర్వసాక్షివైయైన నిన్ను దీక్షచేసాధింతురా ॥ రారా ॥ కోప ప్రాంతుండుగాకురా నీతాళజాల తాపముణచివోవరా పాపముద్రుంచి రంగ శ్రీకాకుళ్రోచుటకు దీపమై నడిక్షిధిందెరచి నల్లనిస్వామి ॥ రారా ॥

మంగళం.

శ్లో॥ నిత్యాయనిరవద్యాయ సత్యానంద చిదాత్మనే ।
సర్వాంతరాత్మనె శ్రీమద్వేంకటేశాయమంగళం ॥

---

శ్రీ

# విషయసూచిక





Sri Vyasa Press, Tirupati.—27.

